రండోయ్
గుండెల్ ఉంటే!
ఢమఢమ మ్రోగే
ఢక్కల పిలుపులు
వీరుల చెవులకు
విందులు చేస్తాయ్,

* *

విందులు కోరని
మంద భాగ్యులూ
నాతో రావద్దూ!
దారి పొడుగునా
శూరగీతములు పాడుచు పోదాం వస్తారా?

కొడాలి... రాజా.

---

మీ జవసత్వాల నిలకడకు

బ్రహ్మచర్యం

చదవండి. రూ॥ 1—0—0

# మహాప్రస్థానం

మరోప్రపంచం, మరోప్రపంచం
మరోప్రపంచం పిలిచింది.
పదండి ముందుకు, పదండి త్రోసుకు
పోదాం, పోదాం, పైపైకి...

కదం త్రొక్కుతూ, పదం పాడుతూ
హృదంతరాళం గర్జిస్తూ
పదండి పోదాం వినబడలేదా
మరోప్రపంచపు జలపాతం?
దారి పొడుగునా గుండె నెత్తురులు
తర్పణ చేస్తూ పదండి ముందుకు:
బాటలు నడచీ, పేటలు కడచీ
కోట లన్నిటిని దాటండి!
నదీనదాలు, అడవులు, కొండలు

ఎడారులా మన కడ్డంకి?
పదండి ముందుకు, పదండి త్రోసుకు
పోదాం, పోదాం, పైపైకి...

ఎముకలు క్రుళ్ళిన, వయస్సు మళ్ళిన
సోమరులారా! చావండి!
నెత్తురు మండే శక్తులు నిండే
సైనికులారా! రా రండి!
హరోం హరోం హర, హర హర - హర హర,
హరోం హరా యని కదలండి
కనపడ లేదా మరోప్రపంచపు
అగ్ని కిరీటపు నిగ నిగలు
ఎర్ర బావుటా ధగధగలు
హోమ జ్వాలల భుగభుగలు!

• శ్రీరంగం శ్రీనివాసరావు •

---

# ఎర్ర జెండా

*　　　*

ఎగరాలి ఎగరాలి
మన ఎర్ర జెండా
అదురు బెదురూ లేక
అడ్డదియును లేక - ఎగరాలి......

*　　　*

సామ్రాజ్యవాదంబు
సమసిపోవంగ
ధనికవాదంబింక
దగ్ధమైపోవ - ఎగరాలి......

*　　　*

కార్మికుల్ కర్షకుల్
కరము కరమూ గల్పి
జై మనకు జై యంచు
జేజేలు కొట్టంగ - ఎగరాలి .....

*　　　　*

కూలోళ్ళగొంతులో
కొన ప్రాపిరుంచేను
పేదరైతూ మేన
వేడి రక్తాముంచె - ఎగరాలి....

తుమ్మల వెంకట్రామయ్య.

---

సీతలు కావాలా ?

# భారతీయ ప్రబోధం

లో వున్నాయి. ఒక అణా.

# రైతు ఢంకా.

మోగాలి మోగాలి
మా రైతు ఢంకా
అనుమానమే లేక
ఆలస్యమే లేక — మోగాలి॥

మితవాద ధోరణుల్
మంట గలియంగా
మోసగాళ్లంతాను
మాయమైపోవ॥ మో ॥

ఒక్క రైతుల బాధ
బాసిపోవంగా
రక్క సీం డెల్లమా
రాలిపోవంగ — మోగాలి॥

—కాశీవిశ్వనాధ చౌదరి.

# అంతర్జాతీయ గీతం.

ఆకలి మంటచె మలమలమాడే
అనాథులందరు లేవండోయ్!
హింసారతిని సహించగలేకా
ఈనడించినది ధర్మంబెల్లా,
మంచి దినాలూ రానున్నాయీ
మనకందరకును లేవండోయ్!
సాంప్రదాయములె కొంపదీసె నీ
సంకెళ్ళను వే నెగురగొట్టగా,
దాసత్వమునూ తరిమివేయగా
దాసులందరును లేవండోయ్!
ఇంతకాలమూ అనామకులుగా
యే మూలనొ మన్నణచియుంచిరీ,
అంతర్జాతీయ పక్షమే అశేష
మానవకులమై పోవున్,
ప్రధానమగు నీ యంతిమ పోరాటములో
పాల్గొన నందరు లేవండోయ్.

నేలకు, రైలుకు, నిధులకు, గనులకు
నేతలైనవారందరి గనుడీ,
వారి భోగమూ, వారల దర్జా
వారియోగమూ, వారల దర్పం,
ఏ రెక్కల కష్టంబో కాదా ?
ఈగతి మన కష్టార్జితమంతా
యెవరో కొందరి భోగతృప్తికై
ఇనుపపెట్టెయల మూలుగుచున్నది!
ఇప్పుడు దానిని తిరిగి యిమ్మని
అందరమొకటై తొందరచేయుట,
న్యాయముగా మన కొచ్చేదెంతో
అది రాబట్టుటకే సుమ్మండీ,
అంతర్జాతీయ పక్షమే
అశేష మానవ కులమైపోవున్,
ప్రధానమగు నీ యంతిమ పోరాటములో
పాల్గొన నందరు లేవండోయ్!
కార్మిక కర్షక సంయోగంబే
కష్టజీవులందరి కలయిక యే,
పాటుపడే మన యందరి పక్షము
మనదే దేశం, ప్రజలము మనమే,
పనికి దొంగలౌ వారల కిచ్చట

పనిలేదండీ ప్రవేశించగా,
అబ్బబ్బా! మన రక్త మాంసముల
హరించి యెందరు తెగబలిశారో,
ప్రజల యశాంతికి కారణమగు నీ
రక్త పిపాసుల పీడ వదిలితే,
దేశ మంతటను శాంతి తేజమే
దిక్కుదిక్కులను ఆనందంబే,
అంతర్జాతీయ పక్షమే
అశేష మానవ కులమైపోవున్,
ప్రధానమగు నీ యంతిమ పోరాటములో
పాల్గొన నందరు లేవండోయ్!

---

# కూలి పాట

కూలిలందరు ఏకమైతే,
కూటికీ తరుగేమిరా
కూలివాండ్లలోనె బల మిూ
కాలమందున నుండెరా

కూలివాండ్లమైన మనకు
కులములెందుకు తెలుపరా
కూలివాండ్లమైన మనము
కలసియుందము సోదరా;
అన్నా! కూలీ లేకము కావలెరా॥

కష్టపడి యీ మేడలన్నీ
కట్టినది మనమేకదా
కష్టపడి యీ ఫ్యాక్టరీలు
కట్టి వారలకిస్తిమి

కష్టజీవులమైన మనకు
గుడిసెలే గతియాయెరా
కష్టపడి పని జేయుచున్నను

కడుపు నిండుట లేదురా
అన్నా! కూలీ లేకము కావలెరా॥

ఎండ వానల కోర్చి మనము
కండలను కరగించియు
దండిగా రక రకములైన
ధాన్యముల పండి స్తిమి

పండిన పంటంత సోమరి
పోతులకు తెచ్చి స్తిమి
తిండి లేకను చెట్టుగుట్టల
తిరుగుతూ మనముంటిమి;
అన్నా! కూలీ లేకము కావలెరా॥

మనము గుడ్డలు నేసియి స్తే
వాళ్ళు కట్టూకొంటిరి
మనము యిండ్లు కట్టియి స్తే
వాళ్ళు కాపుర ముండిరి

మనము పండి స్తేను పంటను
వాళ్ళు అన్నము తింటిరి
మనము కష్టము చేయుచుంటే
వాళ్ళు సుఖముగ నుండిరి;
అన్నా! కూలీ లేకము కావలెరా॥

మనము మనుజుల మన్న సంగతి
మరచిపోయిరి వారలు
మనము చేసిన కష్టమంతా
మంటలో కలిపేసిరి

మనము మూఢులమంచు పైగా
మాటలెన్నో పల్కిరి
కనికరము సుంతైన లేక
కఠినముగ బాధించిరి;
అన్నా! కూలీలోకము కావలెరా॥

ఒకడు అన్నము తినుట యెందుకు
ఒకడు మాడుట యెందుకు
ఒకడు మేడలో యుండు టెందుకు
ఒకడు గుడిసెలో యెందుకు;

ఒకడు అధికారెందుకూ మరి
యొకడు దాసుండెందుకు
ఒకడు ఎక్కువ యెందుకూ యిం
కొకడు తక్కువ యెందుకు
అన్నా! కూలీలోకము కావలెరా॥

ధనము ధాన్యము తరగనంతా
దేశమందున నుండెరా

తినుటకున్నప్పటికి దానికి
దూరమై పోయామురా

ధనికులే యీ సంపదంతయు
అనుభవించుచు నుంటిరి
తినుటకన్నము లేని మనకు
దానిలో హక్కుండిరా
అన్నా! కూలీలోకము కావలెరా॥

సమ్మెలోనే సొగసు యున్నది
సూటిగా యోచించరా
సమ్మె జేస్తే కూలి యెక్కువ
చక్కగా మనకొచ్చురా

సమ్మెయే మన షాహుకార్లకు
సుత్తెదెబ్బగ తగులురా
సమ్మెయే కూలీల కెల్లను
చక్కని గురుమంత్రము;
అన్నా! కూలీలోకము కావలెరా॥

పి. లోకనాథం.

# ఓ పేద రైతా!

మన బొమికల గూళ్లో - మన ఎండు గుండెల్లో
స్వాతంత్ర్య సమరాగ్ని - ప్రజ్వరిల్లిందంటె
తొలగదా దాస్యంబు - కలుగదా స్వేచ్ఛ.
మల మలా మాడుతూ - మ్రగ్గి పోవుటకన్న
దిక్కు లేదా మనకు - తెన్ను లేదా వేరె?
ఎన్నాళ్ళు వేచినా - ఎన్నాళ్ళు ఓర్చినా
శాంతి లేదా మనకు - సౌఖ్యమే లేదా?
ముప్పొద్దు లందు నా - మురికిమేనీ తోడ
పొలము లోపలబడి - నలిగి పోతున్నాము
ఇంటి కొచ్చామంటె - యింతగంజే లేక
కడుపు మంటాతోటి - కాలిపోతున్నాము
మన బొమికలను గొట్టి - మన రక్తమును పిండి
ఎన్నాళ్ళు ఏలుతారీ - ధనికులీ ధొరలు

తుమ్మల వెంకటరామయ్య.

# కూలోడా?

ఎండలో వానలో । ఏనాటి కానాడు
బండచాకిరి చేసి । బ్రతుకుతావేగాని,
దినము నీ కూలితో । కూలోడా!
తిండైన దొరకునా కూలోడా!

కర్మమంటూ వొకరి । ధర్మమంటావు నీ,
కడుపు మాడ్చక దొరల । కడుపు నింపూతావు
కష్టమంతా నీది । కూలోడా!
కలిగినోళ్ళది సుఖము । కూలోడా!

పగలు రాతురు లెల్ల । పాటుపడి నీ దొరకు,
పండించి కొట్లన్ని నింపించుతావు మరి,
పట్టెడన్నము లేక । కూలోడా!
పక్షిలా తిరుగుదువు । కూలోడా!

వండినా ఎండినా । భయమేమి లేకుండ,
దండిగా నీ దొరకు । ధన ధాన్యముల చేర్చి
పని లేనిచో నీవు ॥ కూలోడా!
పస్తే పడుండాలి । కూలోడా!

పాడి పంటలు గల్ల । పత్రిపుర లుంటానికని,
మేడ మిద్దెలు కట్టి । మిగుల శ్రమ పడు నీవు,

ఉండ నిల్లూ లేదు । కూలోడా!
పండ మంచమూ లేదు । కూలోడా!

దొరలు నీ చాకిరిని । దోచుకొని తింటూంటె,
తిరుగబడి నీ వెపుడు । తిప్పలెడుతావోయని,

కర్మమని చెపుతారు । కూలోడా!
కంగారు పెడతారు । కూలోడా!

పంచదారను మించు ॥ పండుమా చిరుతిండ్లు,
ఎంచరానివి ఎల్ల । ఎపుడు పండిస్తావు,

కంచ మన్నము లేక । కూలోడా!
కుమిలిపోతున్నావు । కూలోడా!

చీనిచీనాంబరములే । చిత్రముగ నేసావు,
వాటి నన్నిటి దొరల । సరకముచేసే నీవు,

జానెడైనా లేక । కూలోడా!
చలిలోన చస్తావు । కూలోడా!

గొప్పోళ్ళు నలుగురూ । కూడి నన్నలయించి,
రెప్పుడూ సుఖపడుట । యేమి టంటావనే,

తప్పుడూ శాస్త్రాలు । కూలోడా!
దాపరం చేశారు । కూలోడా!

రాయిలాగున్నపుడు । హాయిగా చేయించి,
నీ గడ్డరక్తాన్ని । నిలువునా పీల్చేసి,

జీలుపడిపోగానే । కూలోడా!
దగ్గఱకె రానీరు । కూలోడా!

నీ కష్టమే లేందె । సిల్వలేని దొరలు,
ఏనాడు కష్టపడ । కెవరు తిరుగుదువో యని,
దైవ శాసనమంచు । కూలోడా!
తలపైకి నెట్టేరు । కూలోడా!

సోమారు తానేటి । శ్రీమంతు లెల్లారు,
నీశక్తి చేతనే । నిలుచుండినా గాని,
నీమేలు కోరరూ । కూలోడా!
నిన్ను పసువంటారు । కూలోడా!

నీవు తినియో తినక । నిత్యమూ నీ దొరకు,
పావలా డబ్బులకు । పనులన్ని జేసితే,
తిట్లైన్నా తిడతారు । కూలోడా!
దొంగవని తంతారు । కూలోడా!

ఎక్కడా యేనాడు । ఏలోటు రాకుండ,
చక్కగా నీ దొరను । సౌఖ్యపెట్టే నీకు,
రెక్క లాడనినాడు । కూలోడా!
డొక్క కూడాడదే । కూలోడా!

కుడువ కూడూ లేక । కట్ట గుడ్డా లేక,
కడుపు మండినపుడు । కరుకెక్కితావనే,
దడిపించుతారు నిను । కూలోడా!
దేవ్రుడని దైవమని । కూలోడా!

కష్టపడ్డాగాని! కడుపుమాడే నీకి
చస్తాంటె చూచేటి! చచ్చుదేవుని చూసి,
భయమేల భక్తేల! కూలోడా!
భుక్తికీ చూచుకో! కూలోడా!
ధనవంతులనియేటి! పేదవాళ్ళనియేటి,
సంఘాలు రెండేను! స్థిరముగా నున్నాయి,
ఒకదాని కొకటికీ! కూలోడా!
ఎప్పుడూ యెడ పెడరా! కూలోడా!
నిజమునూ గ్రహించి! నిలువు దోపిడి నాపి,
శక్తిగల్గిన నీదు! సంఘ శ్రేయము గోరి,
కళ్ళు తెరచీ నీవు! కూలోడా!
కాలు ముందూ కేయి! కూలోడా!
ఊరకుంటె నిన్ను! ఓర్చి వేస్తారింక,
మత్తొదిలి లేవోయి! ............
నీ ఢాక కెదురేది! కూలోడా!
నీరాక కడ్డేది కూలోడా

గద్దె లింగయ్య
వాసిరెడ్డి నాగేశ్వరరావు.

# పేదోడా!

లేవోయి లేవోయి పేదోడ
లేచి రారమ్మోయి పేదోడ

పవలు రాతురు లనక పండించి పోస్తావు
తినుట కైనా లేదు తిప్పలెందుకు నీకు లే॥
కష్టమా నీవంతు కలిగినోళ్ళది సుఖము
నీచుడవు నీవైతె సోమారికే పూజ లే॥
పనిలేనిచో నీకు పరిహారమే లేదు
బలముడిగి పోగానె పారద్రోలుతారు లే॥
అన్నదాతకు నేడు అన్నమూ కరవాయె
కూలివాడూ కుడువ గంజైనా లేదాయె, లే॥
మనిషిగా పుట్టేవు మానమే లేదాయె
పరువులేని బ్రతుకుపై యీాస పడెదేల, లే॥
చదువు సంధ్యా లేక చచ్చు పీనుగ రీతి
చలము లేకా నీవు సేవ చేసెదవేల, లే॥
ధర్మమూ దాగుంది న్యాయమూ నశియించె
మోసమే మెరుగాయె దోపిడీ దొడ్డాయె, లే॥

దేవుణ్ణి గీవుణ్ణి దేవురించెద వేల
సోమారి పోతుచూ జడిసి కృంగెద వేల లే!
ప్రకృతీ ప్రసాద ఫలితాన్ని పొందంగ
శక్తి హక్కులు నీదు చేతిలో నుండంగ, లే!

— గద్దె లింగయ్య.

---

పురిటప్పు డిష్టాంను అస్పష్టమైన

శ్రీ వేబరా

జీవితము చదివి తీరాలి. అర్ధరూపాయి.

# కూలీల రాజ్యం?

కూలీవాళ్ళము మనము కూలీవాళ్ళము మనము,
కూడూగుడ్డా లేక కుమిలీ పోతూన్నాము,
మేడాలుగట్టేము, మిద్దెలు వేసేము,
కూర్చుందుకైనాను గుడిసైన లేదండి,
మిల్లాలు గట్టేము, సెల్లాలు నేసేము,
గోచీకైనా బాబు గుడ్డింత లేదండీ,
చేనూలు దున్నేము చెట్లాను నాటేము
గంజినీళ్ళైనాను కరువయ్యె మనకండి,
చదువూకోసము పాఠశాలాలు కట్టేము,
చదువూలేక మనము చవటలై పోయాము,
బ్యాంకూలు గింకూలు పెద్దంగ పెట్టేరు,
కూసింతయైనాను కూలోడి కివ్వారు,
చదువూలు గిదువూలు చాలాంగ నేర్చేరు,
చదువూ లేనోళ్ళను చంపివేస్తున్నారు,
సోషాలిజము వచ్చు జోహారు కొడ్తాము,

జోగూల భోగాలు చూర్ణమై పోతాయి
పనిచేయువాడేను ఫలమందుకొంటాడు,
పాటుపడనివాణ్ణి పస్తుండబెడతాము.
శక్తికొలది పని రక్తిగ చేయించి,
అవసరమునుబట్టి అనుభవమిస్తాము,
పైరూలు, పంటూలు! పండించువారికే,
భూమియంతా కూడా। భుక్తమై పోవాలి॥
కౌలు కిచ్చేబాబు। కాల్మీద కాలేసి,
కులికేటి కామందు। కూలిపోవాలండి॥
ఆస్తిపాస్తూలన్ని। అందరివి కావాలి,
అందరు సమముగా। అనుభవించొచ్చండి॥
ఆడోళ్ళ కష్టాలు। ఆఖరైపోవాలి
అన్యాయమూలన్ని! అడుగంటిపోవాలి॥
కులమూ, గిలమూలన్ని॥ గోతులో పడవాలి॥
చేతినిండా పని। నీతిగా కల్పించి,
ఆకలి చిమ్మ్యాను। ఆర్పివేస్తామండి॥
సొంతాస్తులన్నీను॥ సున్నాయిపోతేను,
మోసాములన్నియు। మాసి పోతాయండి॥
రైతే రక్షకుడయ్యె। రాజ్యచక్రము నేడు,
రైతుసంఘమను డప్పు। రంజిల్లు జనమూలు॥
కూలోడు యోసీమ। కూర్చొని కులుకూతు,

ఎళపెళ లాడించి । బళిబళి యనిపించు
అప్పుడు శాంతాము । అప్పుడు సౌఖ్యాము,
అచ్చోట ఆనంద । మచ్చోట సర్వాము॥
అమరా రాజ్యమద్ది । అనుమాన మదియేల
సామ్యవాదము నాకు । సామ్యమెచ్చట బాబు॥
సమ్మెయె సరియైన । సాధన మండోయి,
కూలీల రాజ్యాము । కులుకుతూ వస్తుంది॥
ఎర్రాని బావుటా । ఎగరాలి ఎగరాలి,
సోదార భావాము । వ్యాప్తాము గావాలి॥

—మద్దూరి అన్నపూర్ణయ్య.

---

సామ్యమంటే ఏమిటో,

# సామ్యవాద సిద్ధాంతాలు

చదివితే తెలుస్తుంది. రెండణాలు.

# దేవుడుంటే?

లోకాలెల్ల సృజించియు దయతో
సాకెడువాడొక దేవుండుంటే

సౌఖ్యములెల్లను కొందరకూ; అగ
చాట్లు కొందరి కమరఁపనేలా?

నానాభంగుల నిరంతరంబును
దీనుల బ్రోచెడి దేవుండుంటే

మానవ పశువుల భంగి ధనాఢ్యులు
దీనుల దోచుక సుఖపడుటేలా?

అనవరతంబును దిక్కులేని ప్రజ
గనుఁగొని బ్రోచే దేవుండుంటే

తినను కట్టుకొన లేక కోట్ల ప్రజ
దిన దినమును పడి చావగనేలా?

ఆపన్న శరణ్యుండై యార్తుల
కాపడ దీక్షే దేవుండుంటే

పాపము పుణ్యములేని ధనాఢ్యుల
పరజన పీడన సాగుటేలా?

—విశ్వ

దానవు ధీం[torn] నివారిం[torn]
దాడి వెడలగల దేవుండుంటే
మానవుడొక మానవుడు అన్నమని
మాడి చచ్చినా భయపడడేలా?
ధర్మాధర్మ విచక్షణ జేయుచు
ధర్మబద్ధుడౌ దేవుండుంటే
ధర్మముగా చెమటోడ్చి బ్రతుకు ప్రజ
దారిద్ర్యంబున మ్రగ్గగనేలా?
అనుచిత వర్తనులను దండింపగ
ఘనుడనగాబడు దేవుండుంటే
మనుజుడు సోదర మనుజుని గొంతుక
ధనమునకై తెగగోయుటలేలా?
ఏయేకడ నెపుడేమి జరుగునది
ఎరుగగ గలిగిన దేవుండుంటే
మాయ అర్చకులు "దేవుడి పేరును
మానోరని" ప్రజ దోయుటలేలా?
ఆది అంత రహితుండై జగముల
కన్నిటికిని ఒక దేవుండుంటే
మా దేవుండని మీ దేవుండని
మనుజులు పోరుట మానవడేలా?

ఎల్ల జగ [illegible] కై
వెలిగెడి దేవుం డొకరుండుంటే

చిల్లర దేవుళ్ళ లోకమ్మును
చీకాకొనరుప మాన్పడదేలా?

అణువు మొదలుగా చరాచరంబుల
ఆత్మలన్నిటను దేవుండుంటే

మనుజుడు తనకై ప్రకృతి సర్వమును
మారణజేయుట మాన్పడదేలా?

సకల జీవులూ సుఖపడునట్లుగ
సంరక్షించెడు దేవుండుంటే

ఒకరిని దోచుక ఒకరు సుఖించుట
ఒకనాడేనియు మాన్పడదేలా?

పాపము జేసిన నోపక దుష్టుల
బట్టి శిక్షలిడు దేవుండుంటే?

పాపములందే బ్రతికేవారికి
ఆపదలైనా గూర్పడదేలా?

అనయము సత్కార్యాచరణాత్ముల
పనిగొని బ్రోచే దేవుండుంటే

ఘనులగు సజ్జనులే నిరంతంబును
కష్ట నష్టముల పాల్పడుటేలా?

అతని సృష్టిలి
ఒకటే యనబడు
మతమని గితమని మాయలుచేసి
పతితుల నతగా డేమనడేలా?
జగములంతటా నిబిడీకృతుడై
భగవంతుండగు దేవుండుంటే
జగము పుట్టినది మొదలు యేరికిని
సాక్షాత్తుగ కనుపించడడేలా?

—శ్రీ వాసిరెడ్డి నాగేశ్వరరావు.

---

కాంగ్రెసు మంత్రులిచే నిషేధము తొలగింపబడిన,

# అమ్మ

రష్యన్ నవల సుమా! రూ 1—8—0.

# రమ్యమౌ మార్గము

చంద్రబింబం వోలె
చల్లగా వెలయుచును
భువినెల్ల వ్యాపించి
భూజనుల బ్రోచేటి

కార్మికోద్యము నమ్మరా!
సోదరా !!
కర్షకోద్యము నమ్మరా!!!

రాజవర్గంబనక
రైతూ వర్గంబనక
సమముగా జేసేటి
సర్వదేవతవంటి ॥కా॥

రాజవర్గమువలన
రాజిల్లు చున్నట్టి
బానిసత్వమునుండి
బాయంగ జేసేటి ॥కా॥

వసుధయు
సోదరత్వంబును
శోభింప జేసేటి ॥కా॥

సోమరిపోతులకు
చోటు లేకను చేసి
పాటుపడువార లే
పాలించుచున్నట్టి ॥కా॥

ఉదర పోషణముకై
ఉద్భవించినయట్టి
వృత్తులన్నిటియెడల
వృద్ధి చేబూనిన ॥కా॥

రైతు కష్టములెల్ల
రయమున సాధించి
కూలి సోదరులకు
కూడు కల్పించేటి ॥కా॥

కాల్చిచ్చువలె
కాల్చి వైచుచునున్న
ధనిక తత్వంబును
దగ్ధంబు జేసేటి ॥కా॥

...ాడు

...ులనిచ్చి

కష్టజీవులనెల్ల

కాపాడు దేవతని ॥కా॥

పూరిండ్లు మనకింక

పూర్తిగా పోగొట్టి

ఆనంద భవనములు

అంతటను కల్పించు ॥కా॥

విద్యా విజ్ఞానమును

విశదముగ కలిగించి

అజ్ఞాన తిమిరమును

అంటకుండగ జేయు ॥కా॥

రైతు హక్కులనెల్ల

రయమున గాపాడు

రాజ్యస్థాపన కిది

రమ్యమౌ మార్గమని ॥కా॥

మల్లిపెద్ది కృష్ణమూర్తి.

# "ఏకుల మే కులమని"

" ఏకుల మేకులమని మమ్మడిగిన
ఏమనిజెప్పను లోకులకు?
లోకులకు వలుగాకులకు
దుర్మార్గులకు ఈ దుష్టులకు"
బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రులకు
ప్రాణమువంటిది మా కులము
ధర్మ మార్గమున దప్పక నడచుచు
ధన్యతనొందే దీ కులము ॥ఏ॥
కోటులురానీ కోటులు బోనీ
మాటను దప్పదు మా కులము
ఏటి వెల్లువల కెన్నటికైనను చేటును
జెందదు ఈ కులము ॥ఏ॥
అందగ రానటుపంటి ఫలంబుల
కల్లులుజాచదు మా కులము
పొందుగ దొరికిన కొంచెముతో
సుఖమొందును తృప్తిని మా కులము ॥ఏ॥

# సత్తాలో లెండి

సామ్యవాదమంటే - సమధర్మమేనంట,
సమ సౌఖ్యమేనంట - సత్తా ఉంటే మన దేనంటా
కార్మిక కర్షకులారా - వీరాధి వీరులారా
కర్మమనేదీన కపులారా-బీరులుగాకండి ||సామ్యవాద||

చేసేవారికె ఫలమంట - సోమరిపోతుకు సున్నంట
భూహక్కే రైతులదంట - కార్ఖానలన్నీ కూలీకంట
||సామ్యవాద||

బీదా బిక్కలారా - యువజన సోదరులారా
పసీపాపల్లారా - పరవశులుగాకండి ||సామ్యవాద||
మారణ యుద్ధాలే-మాయమంట మతకక్షలు మచ్చు
కైన లేవంట
నీనాభేద నిమిత్తమె లేదంట - నీతి నియమాలే నిజ
దేవుడంట ||సామ్యవాద||

మానవయోధులారా - మడి మన్నే ధీరులారా
కార్యకలాపులారా-కలియకతో లెండి ||సామ్యవాద||

పి. రామమూర్తి.

# జంగ్లీ చేష్టలు.

బక్క రైతులా
పేగులు పిండీ
డిన్నరులంటూ
దొరలకు కుడుపూ॥

రైతు బిడ్డలా
చెంబూ పళ్లెం
వేలం పరచీ
వెలదుల కిచ్చూ॥

బక్క రైతుకో?
జడిత పూజలూ
గిండీ కేసులో
దండిగ పదలూ॥

కర్షకాంగనా!
గాజులు లాగీ
ఆఫీసర్లను
ఆహ్వానించే

కాశీ విశ్వనాథము.

చచ్చిన శవంలో కూడ ఊపిరిపోస్తుంది

# కామ్రేడ్ డిమిట్రాఫ్

జీవితము. ఒకణా

మించు శ్రమకోర్చి ...
కండలును రక్తమే తె... నట్టి
బడుగులము దీనులమిదె మా పడెడునట్టి
గోడు వినియైన మమ్ము కాపాడు మమ్మ!
పేదజనముల చింత! ఓ పిచ్చముంత!

న్యాయమని ధర్మమని మాయ నాటకాల
నాడు పెద్దమనుష్యులేనాడో నీవు
తలను రెండు పేళ్లవరున దగ్గబోవ
గోరిగినారలు మా కడుపు కోయలేక
పేదజనముల చింత! ఓ పిచ్చముంత!

ఎముక లరుగంగ జేసిన యింత శ్రమకు
అక్రమంబున కనుమూసి అపహరించి
భోగముల దూగు ధనికుల పొంత జేరి
తిరిపెమటు వారలిచ్చు బత్తెమున నీవు
సగము కుంచించి మమ్మిటు చంపుచుంటె!
పేద జనముల చింత! ఓ పిచ్చముంత!

ఆకటను [illegible]మ్ము జంపి తా మనుభవించి
పూర్వజన్మ కర్మమనియు, పుణ్యమనియు
మతిముపేర మమ్మోమార్చి మాయ జేయు
వారి మాయల నొక మాయవై జనించి
మా కడుపు మాడ్చి మము జంపు మారివైతె
పేద జనముల చింత! ఓ పిచ్చిముంత!

మా బడుగు దేహములు గాంచి మా విషాద
దీన రవములు విని ప్రాణమేని లేని
కఠిన శిలలే కరగి పారి కాల్వగా
మనుజుని కటిక గుండెలే తొనుకవాయె
మమ్ము నీవైన రక్షించి మనుప వమ్మ
పేదవారల చింత! ఓ పిచ్చిముంత!

తనువు తనువెల్ల వారికై ధారవోయు
నిట్టి మమ్ముల జంప సృజించినారె
అడచినను ఆగరాని ఈ కడుపు చిచ్చు
కాల్చుచుండునె ధనిక దౌష్ట్యాలనెల్ల
పేద జనముల చింత! జీతాల ముంత!

తోడి మనుజులు మమ్మిట్లు త్రోసివైవ
దేవుడనెడివాడున్న మా దిక్కు గనడె?
ఉండెనో లేదో మా కేల వృత్తిగోల;
నేడు మమ్ముల గాపాడ నీవె గతియు
పేద జనముల చింత! ఓ పిచ్చిముంత !

నారపరెడ్డి రామిరెడ్డి.

# కార్మిక కర్షక శక్తి

మతము పేరితో - మాయలు జేసే
ఒక్క బడుగులా - రెక్కల కష్టం
ఫలితంబంతా - దోపిడి జేసే
భోగలాలసత - ప్రొద్దులు బుచ్చే
ధనికుల్లారా! దనుజుల్లారా!
కార్మిక కర్షక - శక్తి సముద్రం
మూర్చిలు చున్నది - చూడండోయ్
మాయ నాటకములు - మానండోయ్.

కూటికి గుడ్డకు - కూడా నవసి
దేవుడ యంటూ - దిక్కులు జూస్తూ
యేడ్చే కండ్లా - కురిసే రక్తం
దోసిళ్లాది - త్రావి మదించిన
ధనికుల్లారా! దనుజుల్లారా!
కార్మిక కర్షక - కాంతి తేజమూ
కాన్పిస్తోంది కానండోయ్
మాయనాటకములు - మానండోయ్

పూర్వకర్మములు - కబుర్లు చెప్పుచు
దేవుని పేరా - దెయ్యము పేరా
గుళ్ళను గట్టీ - రాళ్ళను నాటీ
మీరలు జేసే - ఘోర కృత్యములు
కుంగుటేళ్ళతో - కూలిపోవు నిక
ధనికుల్లారా! దనుజుల్లారా!
కార్మిక కర్షక - విప్లవ శక్తి
విజృంభించును - జాగ్రత్తోయ్
మాయ నాటకముల - మానండోయ్.

బడుగు మనుజులా - బక్క-పేగులా
ఆకలి మంటలు - అగ్నికీలలకు
సోమరిపోతులు - భోగలాలసులు
మిడుతల రీతిని - మాడే రోజులు
తప్పవు తప్పవు - దగ్గరె యున్నవి
ధనికుల్లారా! దనుజుల్లారా!
కార్మిక కర్షక - శక్తి సముద్రం
ఘూర్ణిలుచున్నది - చూడండోయ్
మాయ నాటకముల - మానండోయ్.

మీరు సృజించిన - చచ్చు సంఘమూ
దొంగల సంఘం - దోపిడి సంఘం
కుంగుటేళ్ళతో - కూలిపోవు నిక
సమాన వాదుల - సత్యసంఘమూ
రైతూ కూలీ - నవీన రాజ్యం

నవ శక్తులతో - స్థాపన జరిగే
మంచిదినంబదె - కాలపు దెరలో
విశ్వదీప్తమగు - చాయల రాగిలె
కార్మిక కర్షక - శక్తి సముద్రం
ఘూర్ణిలుచున్నది - చూడండోయ్
ధనికుల్లారా! దనుజుల్లారా!
మాయ నాటకముల - మానండోయ్.

నారపరెడ్డి రామిరెడ్డి.

---

ఈ భూమీ; ధనమూ అంతా అందరిదీ నంటుంది

# మన సంపద

ఒక అణా

# మా రైతు

"స్వాములే కొందరము - కుళ్ళి చస్తుంటేను
కడుపార తిని మీరు - కదలలేకుంటి"రని
అక్రమంబుల జాటి - మా రైతూ!
ఆవేశమున బల్కు - మా రైతూ!!
ఆగ్రహంబున బల్కు - మా రైతూ!!!

* *

ఆస్తిపాస్తులన్ని - అందరికి పంచేసి
పనిచేసి అందరము - ఫల మనుభవించుదము
అని ధీరతను బల్కు - మా రైతూ!
అది నిజంబై పోవ - మా రైతూ!!
అప్పుడు శాంతిని బొందు - మా రైతూ!!!

* *

పని లేని సోమరుల - బట్టి పని కల్పించి
ధనవంతు డనుమాట - దగ్ధంబు జేయించి
కర్షకుల రాజ్యమని - మా రైతూ!
కార్మికుల రాజ్యమని - మా రైతూ!!
ఘన పతాకం బెత్తు - మా రైతూ!!!

*  *

ఎట్టి జెండా నెత్తి - యెగురుచుండగ గాంచి
యెంతయును సంతసము - నెదయందు ఘటియించి
ఆనందమును బొందు - మా రైతూ !
అందరిని సుఖపెట్టి - మా రైతూ !!
అపుడు సౌఖ్యము బొందు - మా రైతూ !!!

*  *

ఎండవానల కోర్చి - యెగసెపడు చలికాగి
పండించు పంటెల్ల - పన్నకే సరిపుచ్చి
కూడు గుడ్డలు లేక - మా రైతూ !
కూలబడి పోయెగా - మా రైతూ !!
సోలిపడి పోయెగా - మా రైతూ !!!

*  *

కష్టించు ఫలితంబు - కడుపార తినలేక
పండించు ధాన్యంబు - భాగ్యశాలికి జేర్చి
బక్క చిక్కిన మేన - మా రైతూ !
పలుపాట్లు పడుచుండె - మా రైతూ !!
పస్తులే పడుచుండె - మా రైతూ !!!

*

కష్టజీవికి త్రాగ - గంజి[illegible]యుండ
ధనికులే భోగాల - తందనా లాడంగ
యీ యక్రమము జూచి - మా రైతూ !
ఎద దలచ కుండునా - మా రైతూ !!
ఎదిరించకుంటునా - మా రైతూ. !!!

—దేవయ్యా చౌదరి.

---

సామ్రాజ్యవాదపు కూట నీతిని కూలంకషముగ

# వలస దేశాల సమస్య

తేటపరుస్తుంది. ఒకణా.

# చిలిపి బళ్లు

నిలువెత్తు చక్రాల - జలదరించే బళ్లు
వేలకొలదీ మైళ్లు - వేగ పరుగిడు బళ్లు
చీల్చుకొని గాలిలో - ఎగిరిపోయే బళ్లు
చీల్చుకొని నీళ్ళలో - మునిగిపోయే బళ్లు
ఏమి చేశావోయి - కూలోడా-
ఎంత కష్టించావు - కూలోడా-
చిలిపి చిలిపీ బళ్ళు - చేసావుగానీ,
ఎన్నడైనా నీవు - ఎక్కి తిరిగావా-?
నీ కష్ట మెటుపోయె - కూలోడా-
నీ సౌఖ్య మేమాయె - కూలోడా
పెద్ద పెద్దల మంటు - దొంగ లంతాను,
దోచి తింటున్నారు - కూలోడా-
ఎఱుగ కుంటున్నావు - కూలోడా-
ఇప్పుడైనా నీవు - ఎదిరించకుంటే,
నీ నెత్తురి తాగేసి - నిన్ను మింగేస్తారు
మేలుకో, మేలుకో - కూలోడా-
మేలుకొని ఎదిరించు - కూలోడా-

ఊక్క— ... దు నమ్మోట పెట్టు
వొంచ లేదా ... మ్ముల్లను

లేవోయి! లేవోయి! - కూలోడా-
ఏల భయపడతావు - కూలోడా-

ప్రకృతి నంతా చేత - బట్టినా వంటావు
నాజూకుగా దాన్ని - నడుపుతా నంటావు

ఎవ కోసరమోయి! - కూలోడా
నీకు కానిదియేల! - కూలోడా

చిరిగి చిరిగీ ఒళ్ళు - చేశావుగాని,
ఎన్నడైనా నీవు - ఎక్కి తిరిగావ !!

—ప్రయాగ కోదండరామశాస్త్రి.

---

కమ్యూనిజం, సోవియట్‌లను గూర్చిన సందేహాలను

# స్టాలిన్-లడ్విగ్‌ల సంభాషణ

రూపు మాపుతుంది. 0—1—6

# అప్పుడే చూడాలి

ఒంట్లో సత్తువ లేక - ఇంట్లో గింజలు లేక
త్రాగా ముంతా లేక - క్రుంగిపోవుచునుండె
కుళ్ళిపోవుచునుండె - రైతు
బక్క చిక్కుచునుండె - రైతు.

కట్ట బట్టా లేక - తట్ట బుట్టాతోను
వెట్టి చాకిరి జేసి - పొట్టకూటికి లేక
నష్టాలు పడుచుండె - రైతు
పలు, కష్టాలు పడుచుండె - రైతు.

ఇకనైన మేల్కొనుడు - ఇకనైన చూడండి ముందు
ఇకనైన తుడువండి కళ్ళు - ఇకనైన తెలియండి వళ్ళు
నిజమైన శక్తితో - నిజమైన యుక్తితో
నిజమైన భక్తితో - నిజమైన మనసుతో
చేసేటి సేవయె - కావాలి కావాలి.

మతము భేదము తోను - జాతుల భేదముతోను
బొల్లులాచే తాను - కల్లలాచే తాను
కాలాము బుచ్చాక - ప్రజలలో కలిగేటి
ప్రళయమూ చూడాలి - నిజమేమొ తెలియాలి

నీది నాదీ లేక
సేవాలు చేయాలి - స్వార్థము అటుండ
రైతూల కూలీల - రాజ్యము రావాలి
నిజమైన సుఖమూలు - నిజమైన భోగాలు
నిజమైన స్వాతంత్ర్య - మప్పుడె చూడాలి

---

రక్తాన్ని వుడుకెత్తించే

# క్రాంతి గీతాలు

పాడండి

రూ

# పోరాలోయ్!

ఎండలో వానలో - గండు చలులలో
ఎంత చేసినా - గొంతుక దిగదు?

పొట్ట పట్టుకొని - పొద్దుగూకులూ
చాకిరి చేసిన - ఆకలి తీరదు।

పుణ్య పాపములు - పూర్వ కర్మలని
ప్రొద్దు పుచ్చకను - నిద్దుర మేలుకో

దేవ దేవ నను - బ్రోవుమటంచూ
దేవులాడకనూ - దేబెరించకనూ

నీవు నమ్మినా - దేవుడె వుంటే
కష్టకాలమున - గావడె? నిన్ను

సుత్తి కొడవలి - హత్తిన జండా
చేత బట్టుకొని - పోరాలోయ్।

ముత్తేవి మాధవాచార్య

# ఒళ్లు మంట

దేముళ్ళంచూ దేవతలంచూ
మతాలు అంచూ మంత్రాలంచూ
పుణ్యాలంచూ పాపాలంచూ
స్వర్గంబంచూ నరకంబంచూ
రాతిబొమ్మలే రంగళ్ళంచూ
మోక్షము కొఱకే మతము మార్చమని
మాయ మాటలే మప్పి మనుజులను
మోసము చేసే మనుజ రాక్షసుల
    తగవులు వస్తే తదుపరి చూద్దాం
    బుఱ్ఱమీద కఱ్ఱేసి కొట్టరా!
మాలోళ్లంటరు మాదిగలంటరు
దేవుని పొందగ తగని జాతులని
దేవళంబులకు దూరులఁజేసి
భారత సుతులను భావము లేక
అన్నదమ్ములనె మన్నన లేక
కలియ జూసితే కసరికొట్టరూ
దగ్గరకొస్తే 'దూరం' అంటరు
రా-దారి - నడిస్తే రాళ్ళు రువ్వుతరు

మాలమాదిగలు మలినపువాళ్ళని
జ్ఞానములేని హీనజాతులని
మానములేని మూఢజనులని
మాయలు చెప్పె మనుజ రాక్షసుల

తగవులు వస్తే తదుపరి చూద్దాం
బుజ్జమీద కఱ్ఱేసి కొట్టరా!

కష్టంబంతా కార్మికులదిగద
అధికారము ధనాధికారులది
కార్మిక కర్షక కాయకష్టముకు
ఫలితముండలని పలవరించుచు
ధన మదాంధుల దౌర్జన్యంబును
దగ్ధము చేసె దారిచూపుడని
బుద్ధులు చెప్పె పెద్దల మాటల
బెడచెవినెట్టె పెడసర వెధవల

తగవులు వస్తే తదుపరి చూద్దాం
బుజ్జమీద కఱ్ఱేసి కొట్టరా!

దేముడి పేరట ఘూ_ర కార్యములు
మతము పేరట మాయలు యెన్నో
జరుగుచుండ యీ జగడము లేదుకు
దేముడి మాట తదుపరి చూద్దాం
దేశముకొఱకు దేహము నిమ్మా
మతమును కూర్చి మాటలాడుదము

జాతి దుస్థితికే జాలినొందుమీ
దేశ సేవయే దేముడి సేవ
మానవ సేవయె మాధవ సేవ
ఆలసింపకూ హాస్యములాడకు
కాలము మించిన కార్యము జరుగదు
నడుముగట్టి యీ నాట్యరంగమున
కుటికి కార్యముల నెఱవేర్చుమురా
అడ్డుతగిలెడి అధమాధములను
తగవులు వస్తే తదుపరి చూద్దాం
బుఱ్ఱమీద కఱ్ఱేసి కొట్టరా!

సమానత్వమే సాటి ధర్మమని
హీనత్వము నిల వణగద్రొక్కుడని
నొక్కిచెప్పెడి నెహ్రూ నీతులు
అంటు దోషమే అణగిపోవాలని
గట్టిగ చెప్పే గాంధీ బోధలు
బుఱ్ఱల కెక్కక పాపపు టూహలు
వెదజల్లెడి యీ వెఱ్ఱిమూకలను
భారత దేశపు భాగ్యము తెలియక
భారత పుత్రుల భక్తి కీర్తులను
మంటను గలిపే మనుజ రాక్షసుల
తగవులు వస్తే తదుపరి చూద్దాం
బుఱ్ఱమీద కఱ్ఱేసి కొట్టరా!

డి. వెంకటశాస్త్రి.

# అన్యాయ కాలం.

అన్యాయ కాలంబు దాపరించిందిపుడు
అందరము మేలుకోవాలయ్యో
మాన్యాలు భోగాలు మనుజు లందరి కబ్బ
మార్గాలు వెతకాలి రోరయ్యో! అ॥
ఏటి పొడుగున దున్ని ఎరువేసి నీరెట్టి
నూర్చి పండించేది మనవంతు.
గోటుసేయుచు బూతు కూతలను కూసి తల
కొట్టి కొనిపోవు టింకొకరొంతు॥ అ॥
పొగలలో మరలలో పొగిలి పొగిలి సరుకు
పుట్టించి యిచ్చేది మనవంతు
తొగరు వాతెర సొగసు తొయ్యలులతో కులి
విరగబడుచుండు టింకొకరొంతు॥
కూలి చాలక కడుపు మాడుతూ గుహలలో
కుందుతూ కుళ్ళడము మనవంతు
గాలిమేడలలోను కమ్మతావులలోను
గర్వముగ భోగ మింకొకరొంతు

— గరిమెళ్ళ సత్యనారా

# రైతు గోల

శీత బాధల వాత బడుచును
మండుటెండల మాడిపోవుచు
కప్ప కంబళి కట్ట గుడ్డయు
లేక కుందెడు జూడరా!

పంటలన్నియు పండి నింపును
కొట్టులన్నిటి కొదువ నెఱుగక
కడుపు మాడుచు కనలుచుండెడి
రైతు గోలను జూడరా!

పొలమునందున బలము లేదుర
ఎరువులెప్పుడు కరువులయ్యెను,
పంట పండదు పాడి యుండదు.
రైతు గోలను జూడరా।

వెలలు బొత్తిగ కూలిపోయెను
కాసుయొక్కటి కానరాదుగ
రాగి దమ్మిడి రత్నమాయెను
రైతు గోలను జూడరా!

మారువాడీల మాయ వడ్డికి
షాహుకారుల సాలు వడ్డికి
ఆస్థులన్నియు నమ్ముడోయెను
రైతు దైన్యము జూడరా।

ముప్పాలాతని ముంచివేసెను
వంతలాతని వరటబట్టెను
ప్రక్కపీడడు పాటుసేయడు
రైతు గోలను జూడరా॥

విద్దె నేర్చిన పెద్దలందరు
పట్టణాలలో బ్రతుకుచుందురు
రైతు పోయిన రాజ్యమోయిన
తిరిగి చూడరు తమ్ముడా!

వారి చేతులు వట్టి చేతులు
వారి పొట్టలు వట్టి పొట్టలు
వారి కెవ్వరో దారి చూపుట
రైతు గోలను జూడరా!

ఏటికేటికి మొక్కిపోయెడు
శిస్తు అదనము సీమ దాటెను
పాత పన్నులె భారమయ్యెన
ఎట్లు చెల్లును సోదరా!

రైతు తిప్పలు రైతు ఓరిమి
చూడలేమురా, నుడువలేమురా
కళ్లు తిరుగును, వళ్ళు వణకును
రైతు దైన్యము జూడరా!

శ్రీ విశ్వం.

---

యువతీ యువకులకు

**మాలపిల్ల**

మార్గదర్శిని. పావలా.

సర్వసము డయ్యే - సర్వేశు డుంటే
కొందరు కోట్లతో - తులుకగ నేలా?
ఎందరో కూటికి - కుందగ నేలా?

కరుణానిధియౌ - పరమేశుడుంటే
క్రౌర్యము జగతిని - ఏలగ నేలా?
శాంతము ధూళిని - దొర్లగ నేలా?

ప్రేమమూర్తియౌ - ప్రభు డొక డుంటే
ద్వేషా లెన్నో - పెరుగగ నేలా?
రక్తపు టేరులు - పారగ నేలా?

దీన రక్షుడౌ - దేవుడె వుంటే
దిక్కు దిక్కునా - దైన్యం బేలా?
తల్లి బిడ్డలకె - ఎడబా టేలా?

—నార్ల వెంకటేశ్వరరావు

# అక్కడ ఇక్కడ

పెద్ద పెద్దగా - మేడలు వున్నై
మెత్త మెత్తనీ - పరుపూలున్నై
గాలిని విసరా - పంకాలున్నై
వంటలు చేయా - మాలీ లున్నరు
శైరులు గొట్టా - కారులు వున్నై
కుడువా, తాగా - కటగ విడువా
కొల్లగవున్నై - ధనపు రాసులు
దండిగ వున్నై - వేయగవచ్చూ
వేషాలెన్నో - చేయగవచ్చూ
తలచిన పనులు - పిలిస్తె పలుకా
నౌకర్లున్నరు - అధికారానికి
వూళ్ళే వున్నై - అక్కడా

చిన్న చిన్ననీ - గుడిసెలు వున్నై
పండడానికీ - చాపల్లేవు
గాలిని పీల్చా - స్థలమే లేదు
కాలే కడుపుకు - గంజే దొరకదు
మడత కుడుములు - మత్తుగ వున్నై

వళ్ళును గప్పా - వస్త్రం నాస్తి
ధనం లేదు - దస్కం లేదు
దున్నకు బతకా - పొలమే సున్నా
చేసుకు బతకా - కూలే సున్నా.
రెక్కల కష్టం - పరులకు పెట్టా
పిట్టను గొట్టీ - పొయిలో పెట్టా
లిక్కడా.

విష్ణు.

---

కష్టపడ్డా కడుపు నిండకపోతే

# తిరుగుబాటు

తప్పని సరి. పావలా.

# దేఖో మైతడాఖా.

బందాలు తెంచుకుని
బయట బడతానోయ్
బయట లోకాలన్ని
పాలించుతానోయ్! ॥బా॥

మతములంటూ నేడు
సతమతము అవుతున్న
పతితు లందరికి స
మ్మతము చూపిస్తాను! ॥బా॥

దేవుణ్ణి గీవుణ్ణి
రేవులో కీడ్చి, ఈ
దీన లోకాని కొక
దిక్కు చూపిస్తాను! ॥బా॥

—మాధవాచార్య.

# నిద్దుర లేవోయ్.

రైతుల పైబడి - రక్తము త్రాగే
బీదసాదలను - విరుచుకు మ్రింగే
వడ్డీ దయ్యపు - కాళ్ళు చేతులను
నీ గొడ్డలితో - నరికెయ్యాలోయ్!
నిద్దుర లేవోయ్! - కర్షకుడా!!

నాటికి నాటికి - నాటుకు పోయ్యే
చిక్కరి బిక్కరి - రక్కసి పొదలను
నవ నాగరికపు - నాగజెముళ్ళను
నీ గుద్దలితో - తవ్వేయ్యాలోయ్!
నిదర లేవోయ్! - కర్షకుడా!!

ధనిక తత్వమూ - స్వార్థపరత్వము
బిగుసుకు పోయిన - బీటి బీళ్లలను
పాదుకు పోయిన - పాటి దిబ్బలను
నీ నాగలితో - దున్నెయ్యాలోయ్!
నిద్దుర లేవోయ్! - కర్షకుడా!!

కార్మిక వర్గము - కండలు కొరికే
కర్మాగారపు - కఠిన చట్టముల

యంత్రాలయములు - హైన్య పద్ధతుల
నీ గుంటకతో - సరిచెయ్యాలోయ్!
నిద్దుర లేవోయ్! - కర్షకుడా!!

జాతి వైరములు - చదునై పోయిన
జాతీయత వ్యవ - సాయము చేసిన
జన్మభూమిలో - శాంతి బీజములు
నీ జడ్డిగమున - వెదబెట్టాలోయ్!
నిద్దుర లేవోయ్! - కర్షకుడా!!

పైరు పొలాల్లో - బడి తెగతింటూ
రంకెలు బెట్టే - ఆబోతెద్దుల
గంతులువేసే - గంగిరెద్దులా
నీ ములుగర్రతొ - అదిలించాలోయ్!
నిద్దుర లేవోయ్! - కర్షకుడా!!

అల్లిబిల్లిగా - అల్లుకుపొయ్యే
మూఢాచారపు - ముండ్ల తీగెలను
మత విద్వేషపు - కలుపు మొక్కలను
నీ కొడవలితో - కోసెయ్యాలోయ్!
నిద్దుర లేవోయ్! - కర్షకుడా!!

పంటచేలపై - పచారుచేస్తూ
పైపై దిరిగే - పరిగ పిట్టలను
కంకులు కొరికే - కాకి మూకలను
నీ వడిసేలతో - బెదరించాలోయ్!
నిదుర లేవోయ్! - కర్షకుడా!!

కుప్పలు బడ్డా - కుల భేదాన్నీ
కళ్ళాన్నేసీ - నురిపిడి జేసీ
భరతమాతపై - పాటలు పాడుతు
నీ చేతులతో - తూర్పెత్తాలోయ్!
నిద్దుర లేవోయ్! - కర్షకుడా!!

అగ్రజాతులా - ఆత్మల లోపల
అంటుకుపోయిన - అస్పృశ్యతనీ
అతుక్కుపోయిన - అంధత్వాన్నీ
నీ పొలికట్టతో - తుడిచెయ్యాలోయ్!
నిద్దుర లేవోయ్! - కర్షకుడా!!

తాలూ తరకా - గాలికి పోసీ
దయా శాంతులను - ధాన్యపు రాసుల
బండ్లకు నెత్తీ - పాతరబోసీ
నీ గాదెలలో - నింపించాలోయ్!
నిద్దుర లేవోయ్! - కర్షకుడా!!

"శ్రీ భరద్వాజ"

# బీదా సాదా

ఉందామంటే ఊరూ లేకా
తిందామంటే తిండి లేకా
కొందామంటే పైసా లేకా
కూర్చున్నామోయ్!
తండ్రీ!
కుములుచున్నామోయ్!!
రెక్కలన్నీ విరుచూకోనీ
రక్తమంతా ధారవోస్తే
ఒక్కరోజైనానూ పసిగా
డొక్క నిండదోయ్!
తండ్రీ!
పక్క నిండదోయ్!
కూచోటానికి కొంపే లేదు
మా పాణాలకి సుఖమే లేదూ
రాకాసీ లోకాము మమ్మూ
కూక లేస్తుందోయ్!
తండ్రీ!
కేక లేస్తుందోయ్!

డబ్బులన్నీ వారివై తే
కబ్బులన్నీ వారివై తే
అబ్బా మాకూ మిగిలేవన్నీ
దొబ్బులేనోయ్!
తండ్రీ!
జబ్బులేనోయ్!

చెయ్యలేకపోతే దొరలకు మంటా
చేసిందంతా మాకే తంటా
చీవాట్లన్నీ మా వేసంటా
చితికిపొయ్యామోయ్!
తండ్రీ!
చివుకుతున్నామోయ్!

ఎండిపోయెను నరములన్నీ
ఇంకిపోయెను నెత్తురంతా
క్షామదేవత మా గుడిసెలలో
కాలు పెట్టిందోయ్!
తండ్రీ!
గజ్జె కట్టిందోయ్!

---

ఫాసిజం ఎన్ని గంతులు వేసినా

జయం తప్పదు

కమ్యూనిజానికి. ఒక అవా.

# మసిసిద్ధాంతం.

జీవుల క్షేమం
దేవుని మసిలోనూ,
మనుజుల క్షేమం
మతముల మసిలోనూ,
కనబడునూ
వినబడునూ!
దేశం క్షేమం
ధనికుల మసిలోనూ,
బీదల క్షేమం
పదవుల మసిలోనూ,
కనబడునూ
వినబడునూ!

గోపీచంద్.

---

## వద్దురా యికభాగ్యవంతుల పెత్తనంబు

వద్దురా! మనకొద్దురా!!
యిక
భాగ్యవంతుల పెత్తనంబు,
బాధలెన్నో పెట్టి మనలను
బానిసలుగ జేసికొనియు
తృప్తిజెందక తిరుగుచున్న
తిరుగుబోతుల పెత్తనంబు
వద్దురా......

మోసపుచ్చి మనలో నొకనిని
ముద్దుగా జేరంగదీసియు
మనలో మనకు తగవుబెట్టి
మండలించెడి పెత్తనంబు
వద్దురా......

కష్టపడియు పొట్ట నింపక
గణన జేసుక గంజి తాగిన
మదము తలకూ ఎక్కెననియు
మనల తిట్టే పెత్తనంబు
వద్దురా......

మనలో [illegible] ఫ్రలాడగ
మధ్యనొచ్చి కోర్టుకీడ్చియు
శిక్ష వేయగ దొంగ సాక్ష్యము
చెప్పుచుండెడి పెత్తనంబు-
వద్దురా......

మానవులలో జేర్చుకొనక
మనల పారద్రోలి వారలు
కూలికై వినియోగపరుచక
కూలద్రోసిన పెత్తనంబు
వద్దురా......

పాప భీతిని యించుకంతయు
పడక వారలు సంతసముతో
కార్మిక బృందంబునంతను
కష్టపెట్టెడి పెత్తనంబు
వద్దురా......

కష్టపడకయె కడుపునిండా
కమ్మని పక్వాలు తినియు
మనల బాధా పెట్టు సోమరి
మందభాగ్యుల పెత్తనంబు
వద్దురా......

చదలవాడ పిచ్చయ్య.

# ఆవేదనాగ్ని

ఆవేద నెక్కువై ఆవేశ మెక్కువై
వేయి నాల్కలతోడ వేగిరము చెస్తాము.
కష్టపడు వర్గాన్ని యిష్టమొచ్చిన రీతి
పీడించి పీడించి దోచుకో రాదంటు.
మేము సంపాదించి మీచేత బెట్టినా
ధనమంత ఒకచోట దాచుంచ రాదంటు
నిలబెట్టి వీధిలో నీతి చెప్పాతాము
కూడులే కిందరము కుళ్ళి చస్తుంటేను
మస్తుగా తిని మీరు వస్తువుల నన్నింటి
దాచుంచుకొన నేడు తావుండ దండోయ్.
ఆగదోయ్ యికముందు సాగదోయ్ తంత్రము,
కష్టపడు వారిదే కాదె హక్కంతాను,
సోమరికి అందులో చోటుండరాదండి.

చదలవాడ పిచ్చయ్య.

---

రైతు సమస్యల చర్చించు

వాహిని.

చదవండి.

# మంటలు.

నా—

గుండెలో గుబగుబా, ముసిరే,
ప్రళయ కాల ప్రభంజనంతో:—

నా—

కడుపులో కణకణా, రగిలే
మంటలే మిన్నంట లేస్తే;—
భూములూ గీములూ—మండీ:
కోటలూ పేటలూ—కూలీ;
తోటలూ బాటలూ—కాలీ;
మేడలూ మిద్దెలూ—పేలీ;
ఊరులూ పంటలూ—పాడై;
పూవులూ పుట్టములు—బుగ్గై
కావ్యములు కళలన్ని—కాలీ;
చదువులూ సంధ్యలూ—సాగక;
పరువులూ మురువులూ—పోయి;

సానులూ సరసులూ —చచ్చీ;
రాజులూ రాణులూ—రాలీ;
భోగులూ రాగులూ—తూలీ;
యోగులూ జోగులూ—చీలీ;
పీనుగుల పెంటలై—పోగా;

ఖా—

దేవుడూ
దేవతలంతా
తెల్లపోతారు.

పోలుకొండ భద్రియ్య.

# కడుపు మంట

కందివప్పూ కమ్మదనమూ
పూచబియ్యపు తియ్యదనమూ;
    పటపట యెముకల పగులాగొట్టీ
    పిండీపిండీ నాదూవొళ్లు
    పండించిన నెత్తురు చుక్కల
    ఫలితంగాదా?——

కమ్మకమ్మనీ నేతిబొట్టులూ
తియ్యతియ్యనీ జున్నుపెరుగులు:-
    ముళ్ళుముట్రిల డొంకడొరుల్రిల
    ఎండకు వానకు యెండీ చివికీ
    తిరిగీ తిరిగి పశువుల మేపిన
    నాదు కుఱ్ఱడీ లేతకొవ్వూ
    ముద్దల్‌గావా?——

మెత్తని పరుపుల మేనుల వాల్చి
ఈజీ చైరులో బైఠాయించీ
శాస్త్ర చర్చలూ చేస్తూవుండు;

చల్లని గాలిలో సరసాలాడు
సరసులందరూ సంచరించు;
మేడలన్నీ నాదు యెముకల
గూడుల్ గావా?—

'దీనబంధుడు వున్నాడంటూ'
"పూర్వకర్మా ఫలితాలంటూ"
"పెట్టని రోజున పుట్టాదంటూ":
దొంగ ధర్మపూ వుచ్చుల పన్ని;
నాదు గుడిసె, చినిగిన గోచీ;
గంజీనీళ్ళూ, కడుపుమంటా
కలిమేనంటూ కబుర్లు చెప్పే
కలిమీనాథుల కావరమంతా
కాలకుంటుందా?—

పోలుకొండ భద్రియ్య.

---

ఆంగ్లకార పత్రిక
# నేషనల్ ఫ్రంటు ది
అతివాద పత్రికలలో అగ్రతాంబూలము.

# ఊరుకుంటావేల?

ఊరుకుంటావేల నో పేదరైతా?
ఎలుగెత్తి నీ హక్కు లెరిగింపలేవా?
చేయెత్తి నీ శక్తి నెరిగింపలేవా?
పొట్ట కన్నములేక, కట్ట పుట్టములేక,
ఎముక లరిగేటట్టు లెన్నాళ్ళు కష్టింతు?
నీ కుటుంబ వ్యయమ్మే కష్టమైపోవ,
యీ శిస్తు భారంబు నెట్లు మోసెదవోయి?
ఇంటి కడ్డముబడి యేడ్చు నీ బిడ్డల గతి,
తలపోసి విలపించు కులకాంత గనియైన,
నా గేటి కరుగ్రిగాని నాహక్కు లిమ్మనుచు-
ఎలుగెత్తి నీగోడు నెరిగింపలేవా?
ఈ దేశ, మీా భూము, లీ మేడ, లీ సుఖాల్,
అన్నియును నీ పాటునకు మారు రూపులే,
నీవు నాగలి బట్టి నేల దున్నుటచేత,
ఎగురుచూ నున్నారు యీా లక్ష్మిపుత్రులూ!

ఏ బాడి బురదనో, ఏ వాడి ముండ్లనో,
పలు కష్టములు పడి పంట పండిస్తావు;
కడుపునిండా కూడు కాన్పించదేమి?
నీ కష్టముల కింక నియమంబు లేదా?

---

# రైతు చూడకపోతే?

ఆగునా జీవాలు సాగునా లోకాలు,
రాజుగా మనమెంచి రైతు చూడకపోతే,
దేశాలు తలలెత్తునా? దాస్యపున్ పాశాలు తాపీడునా?
ఆవు లంబా యంచు అరచు రైతుల యిండ్ల,
కల్యాణ దేవతన్ కనుల చూడనినాడు,
సౌభాగ్య మేతెంచునా? దేశపున్ సిరిసంపదల్ నిల్చునా?
పిల్ల పైరుల మీద చల్ల తెమ్మెర వీవ,
గాంచి యానందించు, ఘనుని గాంచకపోతె,
సృష్టినైజముగాంతువా? ప్రకృతిని సౌందర్య మిక నిల్చునా?
పగలు రాతిరి లేక పాడుపడు నా రైతు,
కడగండ్లన్ గాంచి యాదరించకపోతె!
రాజ్యాలు యిల నిల్చునా? భూదేవి భగ్నమై పోకుండునా?

శెట్టిపల్లి వెంకటరత్నం, గిరిరాజు రామారావు.

---

సామ్యవాద సమస్యలు

కాంగ్రెస్ సోషలిష్టులో

విడిపోతాయి.

# కర్షకా

నీవు హాలమును బట్టి నేల దున్నకపోతే
రాజాధిరాజులకు రాలదొక గింజైనా
నిలువ నీడున్నదే లేవోయి కర్షకా

రావోయి కర్షకా రణరంగమున దుముక
రైతు రైతని జెప్పి రైతు బలమూతోడ
రైతు సంఘాలుండ రాము రాదంటారు
నిలువ నీడున్నదే లేవోయి కర్షకా

రావోయి కర్షకా రణరంగమున దుముక
పండినా పంటంత శిస్తుకొరకమ్మేసి
పంట ఖర్చుల ఋణము రక్తమును పిండంగ
ఘన దరిద్రముతోడ కడుపగిలి పోతుండ
నిలువ నీడున్నదే లేవోయి కర్షకా

రావోయి కర్షకా రణరంగమున దుముక
కత్తులు బాణాలు ఫిరంగులు తోటాలు

లేవు లేవోయంటూ జాలిపడబోకోయి
నీ హలము కొడవలియె నిజమైన బాణాలు
నిన్ను మార్గానను వార్కి
నిలువ నీడున్నదే లేవోయి కర్షకా

రావోయి కర్షకా రణరంగమున దుముక
ఆంధ్రదేశములోను నీ రైతు నాయకుల
రాష్ట్రి కాంగ్రెస్ పీఠ మెక్కకుండా చేయ
మితవాద నాయకులు పన్నినా తంత్రాలు
తెల్సుకొంటివిగదా నిదురబోయిన నీకు
నిలువ నీడున్నదే లేవోయి కర్షకా

రావోయి కర్షకా రణరంగమున దుముక
నీ శక్తి సామర్థ్యమును నీడగా జూచుకొని
బీహారు లోపలను నీ రైతు నాయకుల
హింస దౌర్జన్యాల నేరులను నసికొల్పి
మితవాద నాయకులు నెట్టివా రేస్తారా? ॥నిలువ॥
అఖిల భారత రైతు సంఘమే యుండంగా
తమ స్వార్థములకొరకు తమ దౌష్ట్యములకొరకు
నేతిబీరల్లాంటి సంఘాలు నెలకొల్పి
నిజమైన సంఘాలు నీరసం బొనరింప
మితవాద నాయకులు సృష్టించుచున్నారు
మెలకువతో కనిపెట్టి కొట్టకుంటే దెబ్బ ॥నిలువ॥

ఎన్నోమారులు నిన్ను మోసాలు చేశారు
భేదాలు పెంచారు నీపెంపు గూల్పంగ
అట్టి పెద్దలకీవు నీతి గఱపకపోతె
కొట్టకుంటె దెబ్బ ధీరతతో వీరతతో
బాలవేసరిలాగా శత్రువులపై దుముక
రావోయి కర్షకా రణరంగమున దుముక

కామ్రేడ్ కొట్టిపల్లి.

---

రైతు ఎల్లరు
హిందీ 'జనతా' పత్రిక
చదివితీరాలి.

# మర్మం తెలిసికో!

ఎండకు ఎండీ, వానకు తడిసీ
బండ చాకిరీ, మెండుగ చేసిన,
కుడువా కూడూ, కట్టా బట్టా
కొదువే నీకూ, కారణమేమి?
కన్నులు తెరచీ, మర్మము తెలిసీ మెలగాలోయ్!
మునుపటి లోకం, మునుపటి రోజులు అనుకొని
'ఓరే!' అంటే, ఒదిగీ ఒదిగీ
'ఎంకా!' అంటే 'ఏంబా'బని
గౌరవ మెరుగని కాయం బెందుకు?
ప్రాణం పోసీ, మానం కొరకు
ఒక్కసారిగా హక్కులు అంటూ
అందరు కలిసీ, అభిమానంతో
నిలబడకుంటే కలకాలంబు
గంజీ, నీళ్లే గతియా మనకు.

సిందుగ కట్టడి నీలో వుంటే
లోకం అంతా, ఆకలి యంటూ
హాడిలిపోయే. అద్భుత శక్తి
అణగి వుందోయ్ నీలోను.

పి. వెంకటరత్నం.

---

# ప్లవ గీతము

విప్లవము కావాలి - విప్లవము రావాలి,
విప్లవ జ్వాలలతో - విశ్వమే నిండాలి.

సామ్రాజ్య వాదంబు సమసిపోయే దాక,
ధనిక వాదం బింక దగ్ధమయ్యే దాక;

చెమటోడ్చి పనిచేయు శ్రమజీవు లేకమై,
శ్రామికుల రాజ్యంబు సాపించునందాక;

శ్రామికుల దోచుకొని సుఖియించు సోమరుల్
విశ్వమున లేకుండ అస్తమించేదాక;

వర్గ భేదాల్ పోయి, వుత్పత్తి సాధనాల్,
వ్యక్తి పరమూగాక సంఘ పరమౌదాక;

ఘోర దారిద్ర్యంబు కరువులూ కష్టాలు,
యుద్ధాలు యివి యన్ని అంత మొందేదాక.

త్వరపడుడు! లాభము పొందుడు!! మోసపోకుడు!!!

# కలప కొలత జంత్రి

రచయిత:

మాదిరెడ్డి పానకాలు నాయుడుగారు

కలప వర్తకము చేయువారికిది హస్తభూషణము. కలప కొనువారికిది ఘనమైన రాజమార్గము. ఎంత క్రొత్త వారికైన నీ గ్రంథము వలన అడుగులు, అంగుళములు, మూడు కైవారములు లేక మధ్య కైవారములు, పొడవు, వెడల్పు, గుండ్రము మొదలగు అన్నిరకముల కొలతలు సులువుగా తెలియగలవు. నల్లమద్ది, టేకు, విరుగుడుచేవ, వేగిస మొదలగు కలప వర్తకము చేయువారికి, కొనువారికి, కలప కొలతలను తెలియగోరు ప్రతివారికి నిది మిగుల ఉపయుక్తమైనది. ఇట్టి జంత్రి ఇదివర కెచ్చటను వెలువడలేదని ఘంటాపథముగ జెప్పగలము. కొలది ప్రతులు మాత్రమే గలవు. కాన ఆలసించి ఆశాభంగమునొందక త్వరపడుడు!

వెల రు 2—0—0. పోస్టేజి రు 0—8—0.

వలయువారు:— సుగ్గిశెట్టి చిన్నయ్యా,

మర్చంటు - బెజవాడ.



## మనసు ఫౌండేషన్

## పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA106B174 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 83 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 1,2 65to72 ~~NO~~ |
| తయారు చేసినది | Hema |
| పేజీలు విడదీసినది | Hasin. |
| స్కాన్ చేసినది | Haseema |
| పరీక్ష చేసినది | lakshmi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |